కూపేక్షేత్రే ద్విదర్శనం। స్వగృహే ధనమాప్నోతి
అన్యగృహేధనక్షయమ్ ॥

—రజస్వలావస్త్రఫలమ్—

శ్లో॥ పట్టువస్త్రా పతియుతా ఛిద్రవస్త్రా పరాం
గనా। హరిద్రవస్త్రా సుగుణా దుఃఖితా మలినాం
బరా॥ రక్తవస్త్రే వృషయేపుమాంశ్చ నమేచకన్యా
ప్రథమేచగర్భమ్ ॥

—వస్త్రముమీాదబిందుఫలమ్—

శ్లో॥ రక్తం చతుర్థాచ సదాచరోగి త్వయేచ
లక్ష్మీగుణసాంప్రవృద్ధిః ॥

—వస్త్రదిక్ఫలమ్—

శ్లో॥ ప్రాంచ్యాం పంచలభేత్పుత్రం శ్వేతవస్త్ర
రజస్వలా। ఆగ్నేయాంచ పుమానేకః నీలవస్త్ర
రజస్వలా॥ యామ్యేచాష్ట పుత్రాస్స్యాత్ వస్త్రం
మాతనమేవచ। నైరృత్యాంమలినంవస్త్రం నారీ
వంధ్యాభవిష్యతి॥ వారుణ్యాం రక్తవస్త్రం స్యాత్
షట్పుత్రాచ పతివ్రతా। వాయవే శ్వేతవస్త్రం
స్యాదష్టపుత్రాసతీభవేత్॥ ఉత్తరేదశపుత్రాస్స్యాత్
శుభవస్త్రం తథైవచ। ఈశాన్యేదశసుతా ఛిద్ర
వస్త్రంతథైవచ॥



—కళత్రస్థానఫలమ్—

శ్లో॥ జామిత్రే విధవాసూర్యే శశాంకే పుత్ర
ఘాతకీ। భౌమతేమృత్యుమాప్నోతి బుధేవంధ్యాం
గనాభవేత్॥ బహుభాషి గురు స్త్రిషేత్ భృగుర్న
ష్టకులాతథా। శనిఃతిష్ఠతి దాసీహిస్యాత్ గృహిణీ
స్వాశనీభవేత్ ॥

—శుభపాపగ్రహస్థిత నక్షత్రఫలమ్—

శ్లో। ప్రథమార్తవ నక్షత్రే కుజకేతూ మృత
ప్రజాః। జశుక్రసహితో వంధ్యా సగురుస్స్యాత్తప
స్వినీ। సాదిత్యేపతిహంతీచ సరాహు రారిణీతథా॥

—దోషమాసములు—

శ్లో॥ భరణ్యాందశమాసంతు పూర్వాత్రయెష్టికం
తథా। మఘాద్వాదశ మాసాని షణ్మాసంతు పున
ర్వసు। కృత్తికాజ్యేష ఆశ్రేషా చత్వారోమా
సమేవచ ॥

—ప్రథమరజస్వల దర్శనఫలమ్—

శ్లో॥ ఋతుదర్శనకాలేతుస్వయందర్శనదుఃఖతః
కన్యాదర్శన భోగీస్యాత్ మిత్రదర్శన రోగకృత్॥
మాంగల్యంచ సుమాంగల్యం విధవావిధవాభవేత్
రోగరోగిభయంచైవ దాసీదారిద్ర్యమేవచ ॥

-బిందు ఫలాని-

శ్లో॥ ఏకాదశాపత్రు తథా కనిష్ఠా ద్విపట్కరు
దోర్భిఅనామికాచ। త్రిసప్తక ద్వాదశమధ్యమంచ
చతుర్దశ త్రీణి దశతర్జనీంచ। బాణేచ నవమంచర
మంగుళేచ రాత్రిచనాఖ్యామితినిర్ణయంచ।

-రాత్రౌనక్షత్రదర్శనమ్-

శ్లో॥ జ్యేష్ఠాదీనామతిక్రమ్య రేవత్యాదిరనాగ
మం ఆరుద్రాదిసమంకుర్యా న్నవపద్ద్వాదశ స్తథా॥

-గ్రహములకు ఉచ్చనీచములు నిర్ణయము

శ్లో॥ రవేర్మేష తులాప్రోక్త చంద్రస్య వృష
వృశ్చికే। భౌమశ్చ మృగ కర్కిచ కన్యా మీనే
బుధస్యచ॥ గురుశ్చ కర్కిమకరే మీనే కన్యాసి
తస్యచ। తులామేషౌచమందస్య ఉచ్చనీచాఃప్రకీ
ర్తితాః। రవిశ్చమేషేవృషభేశశాంకే శనిస్తులాయాం
మకరేచభౌమే। గురుఃకులీరే భృగుమీన యుక్తే
బుధేచకన్యాఇతి ఉచ్చసౌజ్ఞః॥

-అదాయవ్యయములు-

శ్లో॥ రాశీచసంఖ్యాం నృపతీచయుక్తం త్రిగుణ్యా
గుణ్యాం శర సంయుతించ। పంచదశే హరేర్భాగం
శేషమాదాయమాచరేత్॥ తల్లబ్ధంత్రిగుణీకత్యా



బాణసంఖ్య యుతంతథా। పంచదశ హరేర్భాగం
తచ్ఛేషంవ్యయమాచరేత్॥

-శుభచంద్రస్థానములు-

శ్లో॥ తులాకుంభాంగనా సింహ్వా వ్యష్టమేందు
శుభప్రదం। శేషవ్యష్టమశ్చంద్రశ్చేచ్ఛుభకార్యా
ణివర్జయేత్॥

- స్తంభప్రతిష్ఠకు మంచినక్షత్రములు -

శ్లో॥ మృగశిర కర పూషా త్వష్ట్రి మిత్రోత్త
రార్య। శ్రవణదినిజలేశే వాసవేదస్రభేషు। బహు
సుతధనవంత స్తంభఘాతః ప్రవేశ స్తః। సకలముని
మతంస్యా న్మానవానాం గృహార్థే॥ ధనిష్ఠాచోత్త
రాషాఢా చిత్రాశ్రవణరోహిణి। హస్తామృగశిరా
స్వేవ స్తంభస్థాపనముత్తమమ్॥

—వారములు—

శ్లో॥ శశికలహామరిష్టం భాస్కరం శ్చాగ్నిదగ్ధం
శిశువధమపిమందో భూమిపుత్రో కళత్రం॥ బుధగురు
కవివారం స్తంభఘాతే ప్రశస్తాః। సకలమునిమతం
స్యాత్ మానవానాంగృహేగృహే॥ స్తంభప్రతిష్ఠ
అగ్నానామష్టమం గ్రహావర్జితం। రవి నేక్తృహానిశ్చ
శశీనాంపత్నిహానికృత్॥ కుజేనాగ్నేశ్చసంప్రాప్తి
బుధోపుత్రవినాశకృత్। గురుర్నష్టం భృగుర్హాని

మందోద్రవ్యాదినాశకృత్ ॥ రాహౌ కేతౌ భవే
ద్వ్యాధిః చంద్రమాపరివేధనం। శిరోవేధాపతింహంతి
గృహకర్ణేయథాక్రమమ్ ॥

—మాసములకు—

శ్లో॥ చైత్రమాస గృహారంభే ధనధాన్యసమృద్ధయః। వైశాఖేశుభంప్రోక్తం జ్యేష్ఠేచమరణం ధ్రువం ॥ ఆషాఢే గోకులం హంతి శ్రావణే పుత్రవర్ధనం। భాద్రపదే సదారోగి అశ్వీజేకలహంతథా॥ కార్తికే రత్నలాభః స్యాత్ మార్గశీర్షే మహాధనం (మార్గశీర్షే మహాభయమితి కేచిత్పాఠః)॥ పుష్యే చాగ్నిభయం వింద్యా మాఘేచ బహుపుత్రదః। ఫాల్గుణ్యాంసర్వలాభంస్యాత్ ఇత్యేతేమాసనిర్ణయః

—లగ్నములకు—

శ్లో॥ మేషేచ వృషభే ధాన్యం మిధునేదహానం భవేత్। కర్కటే జలదాయీ స్యాత్ సింహేబహుసుతోదయః॥ కన్యాయాం నిత్యదారిద్ర్యం తులాయాంశోభనంభవేత్। వృశ్చికే ధాన్య సంపత్తిః ధనుర్లగ్నే ధనక్షయః। మకరే మహదైశ్వర్యం కుంభే బహుసుతోదయః॥ మీనే పుత్రవినాశాయ గార్గ్యస్యవచనంయథా ॥



—వాస్తుపురుష నిర్ణయము—

శ్లో॥ ఐంద్రింశిరోభాద్రపదాదిమాసే యామ్యంశిరో మార్గశిర త్రయేచ। ఫాల్గుణ్య మాసాదిషు పశ్చిమేషు జ్యేష్ఠాదిమాసేషుతథోత్తరంచ॥ మధ్యాహ్నేచరితంపూర్వం క్షణికవాస్తుప్రకీర్తితం। నిత్యవాస్తుప్రవక్ష్యామి ప్రాతరుత్తరతశ్శిరం ॥ మధ్యాహ్నేచరితంపూర్వం అపరాహ్ణేతుదక్షిణే। సాయంకాలేచయోవాస్తు పశ్చిమేశిరస్తథా॥

—ఏకవింశతిమహాదోషములు—

శ్లో॥ ఆద్యః పంచాంగ దోషంచ ద్వితీయేసూర్యసంక్రమాత్। తృతీయే పాప షడ్వర్గం భృగుషట్కంకుజాష్టమే॥ దంపత్యోరష్టమోలగ్నం షడక్షీణేందు వ్యసంగ్రహః। దుర్ముహూర్తో వారదోషం ఖార్జూరస్తు గ్రహాంఘ్రిభం ॥ గ్రహణోత్పాతభం క్రూరం ధిష్ణ్యచాశుభవిద్ధభం। గండాంతే కర్తరీ దోషం సర్వదా విషనాడికాః। కునవాంశో మహాపాతే వైధృత్యోస్త్వేకవింశతిః॥

—పుష్కర హంశలు—

శ్లో॥ ఏకవింశోఽంగ మనుశ్చైవగర జినాశ్చాఽర మునయః ఽ క్రమాత్। మేషాది మీన పర్యంతం పుష్కరాంశాః ప్రకీర్తితాః॥

—ద్వాదశభావములు—

జన్మస్థానము ఒకటి। వాక్స్థానము రెండు। భ్రాతృస్థానము మూడు। విద్యాస్థానము నాలుగు పుత్రస్థానము ఐదు। రిపుస్థానము ఆరు। కళత్రస్థానము ఏడు। ఆయుస్థానము యెనిమిది। పితృస్థానము తొమ్మిది। కర్మస్థానము పది। లాభస్థానము పదకొండు। వ్యయస్థానము పన్నెండు॥

—ప్రశ్నభాగలు—

శ్లో॥ నవషోడశ బాణవిరించిముఖం గిరిలోచన రుద్రమనుప్రియుతం। రవి విశ్వసుమంగలం శంభు శదంనవపావకదశపక్షయుతం।

(౮-౧౬-౫-౪) (౭-౨-౧౧-౧౪) (౧౨-౧౩ ౮-౧) (౬-౩-౧౦-౧౫)

—శ్రీరామప్రశ్న చక్రము—

శ్లో॥ స్థాననాశంచరామేణ సీతాయాందుఃఖమేవచ। లక్ష్మణే కార్యసిద్ధిశ్చ సర్వలాభో విభీషణే। మరణం కుంభకర్ణేచ రావణేన కలక్షయః। అంగదేనధ్రువంరాజ్యం సుగ్రీవప్రియదర్శనం। ఇంద్రతనయంచ కల్యాణం కార్యనాశంచ శూలినీ। సర్వలాభో హనూమంతం దీర్ఘమాయుష్య జాం



బవాన్। నారదేకలహంచైవ భరతేబంధుదర్శనం। కైకేయీకార్యనాశాయ గుహేనప్రియదర్శనమ్।

—బాలారిష్టములు—

శ్లో॥ చంద్రాష్టమంచ ధరణీసుతసప్తమంచ। రాహుర్నవంచ శనిజన్మ గురుతృతీయే। అర్కస్తు పంచ భృగుషట్క బుధశ్చతుర్థే। మాతార్థహాని మరణానియథాక్రమేణ॥

—ఖచరయోగఫలాని—

శ్లో॥ సూర్య నక్షత్ర మారభ్య నిత్య నక్షత్రగణ్యతే। నవత్రిణి చతుష్కంచ యోగోయంఖచరం తథా॥ వివాహేచ దుర్మరణం సీమంతేచ శిశుక్షయం। మౌంజీ బంధే వటోర్నాశం ప్రయాణే మరణంధ్రువం॥ విద్యారంభేషుమూఢత్వం కృష్యారంభేచనిష్ఫలం। నవాన్నభోజనం వ్యాధిం మృత్యుర్బాలాన్నభోజనమ్॥

—ప్రణయణకాలే తిథిఫలానిచ—

శ్లో॥ యాత్రారంభం కరిష్యామి మంగళంకృష్ణపాడ్యమి। కార్యసిద్ధి ద్వితీయంచ ఇష్టలాభం తృతీయకే॥ ధనలాభంచ పంచమ్యాం ధననాశం చతు

రకే। చోరశత్రుభయంషష్ఠే సౌఖ్యసిద్ధిశ్చసప్తమీ॥
వ్యాధిపీడాచాష్టమ్యాంమృత్యుస్స్యాన్నవమీతిథౌ
ధనాగమందశమ్యాంచశుభకామేకాదశీదినే॥అరిష్టం
ద్వాదశీచైవ సర్వసిద్ధిత్రయోదశీ। చతుర్దశీచోర
బాధా పౌర్ణమాస్యాం సుఖంహరేత్ । అమావా
స్యామరిష్టంచ సర్వకాలేషువర్జయేత్ ॥

—ప్రయాణకాలగ్రహఫలము—

శ్లో॥ లగ్నాష్టమే సూర్యపుత్రే పంచభృగుత్రీణి
చరాహుభామే కేతోవట్। సూర్యషట్ చలగ్నే
ప్రయాణకాలేశుభదంవదంతి॥

శ్లో॥ చంద్రజీవసితసౌమ్య కేంద్రగై సూర్య
షష్ఠదశమస్థితోపివా। అశ్వదంతి ధనలాభంచ పం
గ్రహంశీఘ్రమేవచ ఫలమేః సిద్ధ్యతమ్ ॥

—అష్టమచంద్రుడు—

శ్లో॥ అష్టమస్థే నిశానాథే కర్కటే పాపవర్జ
యేత్ । ప్రయాణే సుఖమాయాంతి సౌఖ్యలాభ
సమన్వితే। పంచమం నవమం చైవ త్రికోణమితి
సౌజ్ఞికమ్॥

—ఆయుర్దాయనిర్ణయము—

౧-౩-౧౨-౨ ట అష్టమాధిపతియుంటే ఆయు
స్సు ౧౦౦ సం॥



౨-౫-౮-౧౧ ట అష్టమాధిపతియుంటే ఆయు
స్సు ౭౫ సం॥

౧-౭-౧౦ ట అష్టమాధి పతియుంటే ఆయు
స్సు ౫౦ సం॥

—గ్రహములకారకత్వములు—

1 ఆత్మా పిత్రభావ, నశ్యాది రాజయోగజల
వాహనకారకోరవిః

2 మాతృ, శీతసస్యావనస్పతి భోజనసౌఖ్యబుద్ధి
విలాసకారకో చంద్రః

3 భ్రాతృసత్యగ్రహక్షేత్రరణరోగధైర్యశస్త్ర
సాహస మణిమంత్రౌషధ క్రియాసిద్ధి శోత్రియజీవ
కారకో కుజః

4 మాతుల బంధు గణిత శిల్పి తంత్ర తర్క
శాస్త్రనీతికారకో బుధః

5 భార్యా బుద్ధి పుత్ర దేహపుష్టి జ్ఞానసౌఖ్య
కర్మకారకో గురుః

6 కళత్ర ధాన్య వాహన మహిష మదన విట
వేశ్యావస్త్ర మణిరత్నాభరణ పీతాంబరాదియోగ
తత్వకారకో శుక్రః

7 ఆయుర్జీవన కృషివాణిజ్యనీచ శూద్రచండాల
తామస భృత్యపరిచారకజనవృద్ధియోగకారకో శనిః

8. భార్యారోగ మ్లేచ్ఛశూద్ర వాహనకారకో రాహుః

9. సత్యకర్మ దేవతాభక్తి తీర్థాచలన భూప్రదక్షిణ సన్యాస వ్యసనమోక్షకారకో కేతుః

—హోరల కార్యక్రమఫలము—

శ్లో॥ గురుర్వివాహే గమనేచశుక్రే విద్యాబుధే వీక్షవిధౌచశౌరి।భౌమాచయుద్ధే నృపదర్శనార్కే సర్వేషుకార్యేషు శశాంకహోరా ॥

—వర్ష హేతునిర్ణయః—

శ్లో॥ బుధ శుక్ర సమీపస్థో కుర్యాదేకార్ణవంజగత్। తయోర్మధ్యేగతేభాను స్సముద్రమపిశోషయేత్॥

—నష్టద్రవ్యస్థనము—

శ్లో॥ తిథి వారంచ నక్షత్రం లగ్నంచ అసలం పునః పంచభిర్హారతేభాగం శేషంతత్రఫలాఫలమ్। పృథివ్యామాదిభూతంచ జలేషుజలసన్నిధౌ। తేజో మానుషహస్తేషు వాయుశ్చైవగృహాంతరే। ఆకాశేఊర్ధ్వభాగంస్యా న్నష్టద్రవ్యశ్చసిద్ధయే॥

—చోరలక్షణము—

శ్లో॥ మేషేచ బ్రాహ్మణశ్చోరో వృషభేక్షత్రియస్తథా। మిథునే వైశ్యజాతిస్తు కర్కటే శూద్ర



మాదిశేత్। సింహేచ బంధు చోరస్స్య కన్యాచోపరాంగనా। భార్యాతస్యతుపుత్రోవా తులాయాం తస్కరో భవేత్। వృశ్చికేతుకిరాతశ్చ యుజమానోహి కార్ముకే మకరేమూషకశ్చోరః కుంభేమాతా వినిర్దిశేత్। మీనే భూమిగతంద్రవ్యం చోరశాస్త్రస్యలక్షణమ్ ॥

—దశాంతర్దశలకు—

శ్లో॥ అథచంద్రస్య నక్షత్రా న్నక్షత్రాత్తారకస్యవా॥ నక్షత్రాణాం క్రమేణైవ దశమాహుర్మనీషిణః।అశ్విన్యాదిక్రమాశ్చైవ జన్మనక్షత్రగణ్యతే నవసంఖ్యహరేద్భాగం శేషంచదశమాదిశేత్॥ కేతుశుక్రరవిశ్చంద్ర కుజో రాహుగురుశ్శనిః। బుధశ్చ తిక్రమాదేతే నక్షత్రేశా మధీశ్వరాః॥ షడ్భానోర్దశచంద్రశ్చ శప్తభౌమస్యవత్సరాః। అష్టాదశచరాహోశ్చ సురాచార్యస్యషోడశ। ఏకోనవింశతిర్మందో బుధస్యదశసప్తచ। కేతోశ్చసప్తవర్షాణి శుక్రో వింశతివత్సరాః॥ మహాదశత్రిభిర్గుణ్యం తద్దశాగుణితంపునః। త్రింశద్భిస్తుహరేద్భాగం లబ్ధమంతర్దశాఫలమ్॥ అంతర్దశాత్రిభిర్గుణ్యం తద్దశైగుణితంపునః। నవభిస్తుహరేద్భాగం లబ్ధమంతర్దశాఫలమ్॥ అంతర్దశాస్త్రీభిర్గుణ్యం తద్దశైగుణితంపునః। ద్వాదశాభిస్తు

వాదంశం లబ్ధసూక్ష్మ దశాఫలమ్ ॥ సూక్ష్మదశా
త్రిభిర్గుణ్యాం భూతసంఖ్యసమన్వితం । నవభిస్తుహ-
రేదంశం లబ్ధప్రాణదశాఫలమ్ ॥

-జన్మకాలఘడియలను నిర్ణయించువిధము-

శ్లో॥ జన్మకాలస్య ఘటికా చతుర్గుణ్యా స్తతః
పరం । మేషాదిలగ్న పర్యంతం సంఖ్యయామిళితం
పునః । స షడ్వింశతిభిర్హృత్వా శేషంస్యాజ్జన్మతార
కమ్। తన్నక్షత్రస్యదశమం తస్మాచ్చదశమంశుభం
తన్నక్షత్రదశానాథ దశభంచేన్నసంశయః ॥ అన్యథా
జన్మకాలస్య ఘటికాందైవచింతకః ॥ న్యూనాంవాప్య
ధికాంకృత్వా నిర్ణేతవ్యంతుపూర్వవత్ ॥

తా॥ జన్మకాలఘడియలను నాలుగుతో పెంచి
ఆసంఖ్యతో మేషము మొదలు జన్మకాలలగ్నము
వఱకు యెంచి వచ్చిన సంఖ్యనుచేర్చి యిరువై యే
డింటిచే భాగించి శేషించిన సంఖ్యను అశ్విన్యాది
గాయెంచగా వచ్చిన నక్షత్రము జన్మ నక్షత్రమై
యుండెనేని లేకదానికి పదోనక్షత్రమైనను జన్మన
క్షత్రదశానాదునిదశానక్షత్రముగ యుండినఅజన్మ
కాలఘడియలు స్ఫుటమని నిశ్చయించుకోవలెను,
అటుపైననక్షత్రములుకాకుండిన జన్మకాలఘడియ
లను తగ్గించిగాని హెచ్చించిగాని పైన జెప్పిన



ప్రకారము జన్మకాలఘడియలను స్ఫుటముగా నిర్ణ
యించవచ్చును.

-లగ్నసందేహము తెలిసికొనువిధము-

శ్లో॥ జన్మకాలేతు సంప్రాప్తే లగ్ననిశ్చిత్యపం
డితః॥ తస్మిన్కాలేఖేచరాణాం చారం నిశ్చిత్యయో
జయేత్ ॥

తా॥ జన్మకాలము సంప్రాప్తమగునేని యాకా
లమునందు గ్రహముల యొక్క సంచారమును
నిశ్చయించుకొని లగ్నమును నిశ్చయము చేసికొన
వలయును

శ్లో॥ సూర్యోదయ గతానాడ్య ద్విసామర్ధేన
సంఖ్యయా । సూర్యఋక్షం భవేదృక్షం సద్యో
లగ్నస్యనిర్ణయః ॥

తా॥ సూర్యోదయాది గతించిన ఘడియలు
సగముచేసికొని యాఘడియలను సూర్యుండుండెడి
నక్షత్రసంఖ్యతో గల్పగా నెంతలబ్ధమగునో యన్నవ
నక్షత్రముగలరాశి జన్మలగ్నమని యెఱుంగవలెను

మఱియొకవిధము॥ జన్మకాల ఘడియలు ౬వ
సంఖ్యచే నెచ్చగుణించి ఆయా నెలల తిథులు
కలుపుకొని ముప్పదింటిచే భాగింపఁగా లబ్ధసంఖ్య
లెన్నో అసంఖ్యగలరాశిని సూర్యుఁడుండెడి రాశిని

వదలి మీదటిరాశి మొదలుకొని యెంచుకొనఁగా నేర్పడ్డ లగ్నము జన్మలగ్నముగా నెఱుంగవలెను.

ఉదాహరణము:— నందననామసంవత్సర శ్రావణ శు ౫ పదునైదు ఘడియలకు పుట్టినవానికి పూర్వోక్తప్రకారము లగ్ననిర్ణయము చేసేవిధము జన్మకాలఘడియలు ౧౫ యింటిని౯రిటిచే హెచ్చు గుణించగానైన మొత్తము ౯౦ యిందుకు పంక్తి మణితిథులు లెక్క ౧౯. కల్పగా వెరశిమొత్తము ౧౦౯ కి 3౦ చే భాగించగాలబ్ధము 3 సూర్యుడుండు రాశికటకము దానినివదలిసింహము మొదలుకొని లెక్కించి మూఁడవదియగు తుఁనులగ్నమని నిశ్చయించవలెను

శ్లో॥ చంద్రలగ్నాధిపో యత్ర తత్త్రికోణమథాపివా। తత్సప్తమ త్రికోణంవా చంద్రలగ్న ముదీరయేత్॥

తా॥ చంద్రుఁడుండెడిరాశి జన్మలగ్నమగును. కానియెడల చంద్రునకేడవరాశి జన్మలగ్నమగును అదిగానియెడల అచంద్రున కేడవరాశి అయిదవది కాని తొమ్మిదవదికాని జన్మలగ్నమగును. చంద్రునికి అయిదు తొమ్మిది రాసులు జన్మలగ్నమగును. కానియెడల చంద్రుఁడుండెడి రాశ్యాధిపతియుండెడి



లగ్నము జన్మలగ్నమగునని యెఱుంగునగును కాని యెడల వానికి ఐదు తొమ్మిది రాసులైనా జన్మలగ్నమగును. అవికానియెడల ఆచంద్రరాశ్యాధిపతికి సప్తమము లగ్నమగును. అసప్తస్థానముదకు ౫-౯ రాసులు జన్మలగ్నమగును ఇట్లుకానియెడల జననఘడియలు పొరబాటని యెఱుంగవలయును

శ్లో॥ సూర్యలగ్నాధిపోయత్ర తత్త్రికోణమథాపివా। తత్సప్త త్రికోణంవా సూర్యలగ్న ముదీరయేత్ ॥

తా॥ పూర్వోక్త శ్లోకమునందు చంద్రునిబట్టి లగ్నమెఱింగినవిధమున యీశ్లోకమునందు సూర్యలగ్నము నెఱుంగవలయును

—జన్మలగ్నము తెలియనియెడల నెఱుంగువిధము—

శ్లో॥ అరూఢాధిపతి ర్నీచ నాయకో యత్రసంస్థితః। తద్దశాధిష్ఠితందాజ్యం లగ్నం బ్రూయాద్విచక్షణః ॥

తా॥ ఆరూఢము అడిగినలగ్నమే జన్మలగ్నము కాదేని అ లగ్నాధిపతికి నీచక్షేత్రముజన్మలగ్నము అదికాదేని అనీచక్షేత్రాధి పతియుండు రాశిలగ్నము. కాదేని అనీచక్షేత్రాధి పతియుండురాశికిఅధిపతియుండు రాశిలగ్నమని యెఱుంగవలయును,

—జన్మనక్షత్రము తెలియనియెడల నెఱుంగువిధము—

శ్లో॥ పృచ్ఛకస్య భవేల్లగ్నం బుషుఘ్నం నాడికాయుతం। చరేచ పంచసంయుక్తం స్థిరేచదశసంయుతం॥ ద్విస్వభావేతిథిర్యుక్తం సప్తవింశతిభాజితం॥ తచ్ఛేషంజన్మనక్షత్రం భవ్యతేన నసంశయః॥

తా॥ ప్రశ్న చేసినకాలమునకు సరియైనలగ్నముయొక్క మేషాదిగానైన లెక్కను అఱంటబెంచి ఆకాలపు ఘడియలు చేర్చుకొని చరరాశియగునేని ౫ దింటిని స్థిరరాశియగునేని ౧౦ దింటిని ద్విస్వభావరాశియగునేని ౧౫ను కలుపుకొనంగా అయిన మొత్తమును ౨౭ చే భాగించగా మిగిలినశేషము జన్మనక్షత్రమగును ఘడియలు తప్పెనేని తప్పిపోవును

—రాజయోగములు—

శ్లో॥ యదిరిపుధనేశౌ ఖేచరౌ నీచసంస్థౌ తదధిప ఖచరోవానీచ రాశిస్థితశ్చేత్। భవతినృపతిముఖ్యో భాగ్యలగ్నాధినాథౌ యదిబలసహితౌ చేత్ శాశ్వతైశ్వర్యయుక్తః॥

తా॥ ఆఱు యెనిమిది యీరాశ్యాధిపతులు నీచరాసులయందుండినను లేకవీరలుండురాశ్యాధిపతులు నీచరాసులయందుండినను జాతకుఁడు



రాజులలో ముఖ్యుఁడుగనుండును భాగ్యస్థానాధిపతి బలవంతుండై యుండిన శాశ్వతైశ్వర్య సంపన్నుఁడుగనుండును

శ్లో॥ కర్మస్థానేతు చత్వారి గ్రహాస్తిష్ఠంతిచేత్తథా। పశ్యంతియదివాయుక్తః జాతాః సామ్రాజ్యమాప్నుయాత్॥

తా॥ కర్మస్థానమునందు నాలుగుగ్రహములుండినను నాలుగు గ్రహములుచేరి కర్మస్థానము చూచినను జన్మించిన వానికి సన్యాసి యోగము లభించును

శ్లో॥ చంద్రస్య దశమస్థానే గురుశుక్రబుధస్తథా। అపిరాజకులేజాతః సన్యాసీభవతిధ్రువమ్॥

తా॥ చంద్రునకు ౧౦వ యింటిలో గురువు శుక్రుడు బుధుఁడు వీరలుండిన ఆజాతకుఁడు క్షత్రియకులమునందు బుట్టినను సన్యాసియగును

శ్లో॥ కర్మేశ పంచమేశౌ చ యుతౌ చేద్రాజయోగదౌ। భాగ్యేశశ్చాపి కర్మేశః సమేతౌ యది రాజ్యదౌ॥

తా॥ ౧౦వ రాశ్యాధిపతి ౯వ రాశ్యాధిపతి వీరలు కూడి యుండిన జాతకునకు రాజ

యోగముకలుగును భాగ్యస్థానాధిపతి కర్మస్థానాధిపతితోకూడియుండినను రాజయోగము కలుగును

శ్లో॥ సుఖేశదశమేశౌవా సమేతౌరాజయోగదా। కర్మేశశ్చధనాధీశ యుతౌ స్త్రీలాభభోగదా

తా॥ సుఖస్థానాధి పతి దశమస్థానాధిపతి వీరలు కూడియుండిన రాజయోగమనిత్తురు. దశమస్థానాధిపతి సప్తమస్థానాధిపతితో కూడియుండిన స్త్రీలాభము స్త్రీసుఖము కలుగును.

శ్లో॥ ఏతావుక్తాధిపా ద్వ్యాచ వ్యత్యయేన స్థితౌయది। రాకయోగప్రదానిత్యం మహాఋషిభిరీరితః॥

తా॥ పైనచెప్పిన రెండుస్థానాధిపతులును స్థానపరివర్తనము కలిగియుండిన రాజయోగమునిత్తురని మహాఋషులు చెప్పియున్నారు

శ్లో॥ లగ్నేస్థిరే దానవమంత్రియుక్తే లగ్నేచరేశ్యాద్యది కేంద్రగేవా। లగ్నేద్విదేహేయదికోణగేచ దుర్గాధినాథోధనభూమినాథః॥

తా॥ జన్మలగ్నము స్థిరలగ్నమై శుక్రుఁడు కేంద్రమునందుండినను జన్మలగ్నము చరలగ్నమై శుక్రుఁడు కేంద్రమునందుండినను జన్మ లగ్నము ఉభయరాశియై త్రికోణమునందు శుక్రుఁడుండినను



జాతకుఁడు దుర్గములు కోటలు మొదలగువాని కధిపతిగాగాని తనభూముల కధిపతిగాగాని యుండును

శ్లో॥ చంద్రోగురుశ్శుక్రబుధస్సౌమ్యాః కేంద్రస్థానగతాయది। ధనవిద్యా సుఖీభోక్తా శాస్త్రపండిత ఏవవా॥

తా॥ చంద్రుఁడు గురుఁడు శుక్రుఁడు బుధుఁడు వీరలు కేంద్రస్థానమునందుండిరేని జాతకునికి ధనం, విద్య, సుఖం, మంచిభోజనం, శాస్త్రపాండిత్యంబులు కలిగియుండును.

శ్లో॥ దుర్లభఃకర్కటేజీవఃశనిఃకుంభేచదుర్లభః। రాజపుత్రోభవేద్రాజా అన్యోవామండలాధిపః॥

తా॥ జాతకునికికటకరాశియందు గురుఁడుండుటయును కుంభరాశియందు శని యుండుటయును దుర్లభము. అట్లు సంచరించినచో ఆ జాతకుఁడు క్షత్రియుండైనయెడలమండలాధిపతియగునుఅన్యుఁడైనయెడల మండలాధిపతియగును.

శ్లో॥ ద్విగ్రహోచ్చేతు సామంతః త్రిగ్రహోచ్చేమహీపతిః। చాతుర్గ్రహోచ్చే సామ్రాజ్యం పంచోచ్చైర్లోకనాయకః॥

తా॥ ఒక జాతకునికి రెండుగ్రహములు ఉచ్చయందుండిన సామంతరాజుగ నుండును. మూఁడు

గ్రహంబులు ఉచ్చయందుండిన రాజగును నాలుగు గ్రహంబులు ఉచ్చయందుండిన సకల రాజులను పరిపాలించెడి చక్రవర్తియగును ఐదు గ్రహములు ఉచ్చయందుండిన లోకనాయకుఁడగును

శ్లో॥ సింహే కేతౌ స్థితే లగ్నే తృతీయే బుధ భార్గవౌ। పంచమేన గతే చంద్రే తస్యరాజ్యం వినిర్దిశేత్ ॥

తా॥ రాహువు లగ్నమందుండి మూఁడవయింట బుధశుక్రులును ఐదవయింట చంద్రుఁడును నివసించిన జాతకునకు రాజయోగము గలుగును

శ్లో॥ లగ్నస్థే చ తథా చంద్రే త్రికోణే జీవభార్గవౌ కర్మస్థానేస్థితే భానౌ రాజయోగో భవిష్యతి ॥

తా॥ చంద్రుఁడు లగ్నమందుండి ౯-౫ వీటియందు గురు శుక్రులును ౧౦వ యింట సూర్యుఁడునుయుండిన జాతకునికి రాజయోగముకలుగును

శ్లో॥ మృగపతివృషకన్యా కర్కటస్థేచ రాహుర్భవతి విపులలక్ష్మీ రాజరాజాధిపోవా। నరగజ రథవాజి మండలం సాగరాంతం రిపుజన పరిహార రాహుతుంగప్రశస్థః ॥

తా॥ సింహం, వృషభం, కన్య, కటకం, వీటియందు రాహువుండిన జాతకుండు విశాలమగు సం



పత్తుగలవాఁడుగ రాజాధిరాజుగ రథ, గజ, తురగ పదాదులతో కూడిన వాఁడుగ శత్రువులను జయించు వాఁడుగ సముద్రమువఱకుండు భూములను యేలెడి వాఁడుగ నుండును ఇది తుంగరాహువు యొక్క విశేషము

శ్లో॥ నిశానాథే దశస్థైవ గురుశుక్రౌ ద్వయే తథా। విక్రమేరవి రాహూచ బుధసౌరీచలాభయో॥ ఏతేషు రాజయోగేషు రాజ్యంభవతి నిశ్చయమ్॥

తా॥ చంద్రుఁడు పదవయింటను గురుశుక్రులు రెండవయింటను విక్రమస్థానమైన మూఁడవయింట సూర్యుఁడు రాహువును పదునొకండవయింట శని బుధులును యుండిరేని జాతకునికి రాజ్యంకలుగును

శ్లో॥ ద్వితీయే గురు సౌమ్యాచ భృగౌ చంద్రయుతే తథా। ఆయుస్సుఖంచసౌభాగ్యం పశువృద్ధిర్యథాక్రమమ్ ॥

తా॥ ౨వయింట గురుఁడు బుధుఁడు శుక్రుఁడు చంద్రుఁడు వీరలుండిన ఆయుస్సు సుఖము, సౌభాగ్యము పశువృద్ధియు యివి యథాక్రమముగా జాతకునికి కలుగును

శ్లో॥ ఉచ్చస్థానగతే సౌమ్యే కేంద్రస్థానే భవంతి

చేత్ । ధ్రువంరాజ్యం భవేత్తస్య కుటుంబాధార నిశ్చయమ్ ॥

తా॥ బుధుఁడు ఉచ్ఛయందుండినను కేంద్ర స్థానమునందుండినను కుటుంబాధారమైన రాజ్యము కలుగును

శ్లో॥ చంద్రాత్కేంద్రగతే భౌమే యోగోమంగళకారకః । మంగళాఖ్యేనరోజాతః నిత్యశ్రీర్నిత్య మంగళమ్ ॥

తా॥ చంద్రునకు కేంద్రమునందు అంగారకుఁడుండిన మంగళకరయోగమనఁబడును దానియందు పుట్టినవాఁడు అగర్భశ్రీమంతుఁడుగనుండును

శ్లో॥ గురుచంద్రౌ కుళీరస్థౌ మారాయోగస్స ఉచ్యతే। మారాయోగే నరోజాతః ధనవాన్ కీర్తి సంపదః ॥

తా॥ గురుచంద్రులు కటకమునందుండిరేని మారాయోగమనఁబడును. దానియందు పుట్టినవాఁడు ధనవంతుఁడుగను కీర్తివంతుఁడుగను యుండును.

శ్లో॥ లగ్నే చతుర్థే బుధభార్గవౌచ తృతీయ రాహుర్నవపంచజీవః। గజాధినాథో తురగేమనుష్యః ఇష్టాన్నభోజీధనసౌఖ్యలాభః ॥

తా॥ లగ్నములేక నాల్గువీనియందు బుధశుక్రు



లుండి మూడింట రాహువు౯-౫ వీనియందు గురు వుండిన ఆజాతకునికి గజాంతైశ్వర్యము యిష్టాన్న భోజనము ధనలాభము సుఖము కలుగును

శ్లో॥ చాతుర్గ్రహా సమాయుక్తాః కుజార్క బుధ మంత్రిణః । చతుర్వేదధరోవిప్రః అన్యోవామండలాధిపః ॥

తా॥ కుజుఁడు, సూర్యుఁడు బుధుఁడు గురువు వీరలుఒకటిగయుండినజాతకుండు బ్రాహ్మణుఁడైతే ౪ వేదములు చదువును. ఇతరుఁడైతే మండలాధిపతియగును

శ్లో॥ చాపే కుంభే హరౌయుగ్మే సంస్థితాసకల గ్రహాః। చతుస్సాగరపర్యంతం రాజాభవతినిశ్చయః

తా॥ ధనస్సు, కుంభము, సింహము, మిథునము వీటిలో అన్ని గ్రహములుండిన చతుస్సాగర పర్యంతముండు భూమికి యజమానుఁడగును.

శ్లో॥ లగ్నస్థే పంచమే జీవే లగ్నస్థౌ శశిభార్గవౌ। జీవాత్కేంద్రరవిర్భౌమో జాతస్సింహాసనాధిపః॥

తా॥ లగ్నములోలేక ౫లో గురువుండిన లగ్నములో చంద్రశుక్రులుండినను గురువునకు కేంద్రములో సూర్యుఁడు అంగారకుఁడు వుండినను ఆజాతకుండు సింహాసనాధిపతియగును

శ్లో॥ భాగ్యేశః కర్మరాశిస్థః కర్మేశో భాగ్యరాశిగః । కేంద్రత్రికోణగోవాపి రాజయోగ స్తథా భవేత్ ॥

తా॥ భాగ్యాధిపతి కర్మస్థానములో నుండినను కర్మాధిపతి భాగ్యస్థానములో నుండినను లేక వీరలు కేంద్రత్రికోణములలో నుండినను జాతకునికి రాజయోగముగలుగును

శ్లో॥ కర్మేశో ధర్మరాశిస్థో ధర్మేశశ్శుభరాశిగః నీచారిమూఢము క్తశ్చేత్ రాజయోగ స్తథా భవేత్

తా॥ కర్మాధిపతి ధర్మస్థానములో నుండి ఆధర్మస్థానాధిపతి శుభరాశిలో నుండి నీచ శత్రుమూఢవర్జితులుగ నుండిన ఆ జాతకునికి రాజయోగము గలుగును

శ్లో॥ భాగ్యరాజ్యపయోరేవ మన్యోన్యం మైత్రి ర స్తిచేత్। ఆయుశ్శత్రువిహీనస్స్యాత్ రాజయోగం భవేధ్రువమ్॥

తా॥ భాగ్యాధిపతి రాజ్యాధిపతులకు మిత్రత్వముండిన యా జాతకుఁడు శత్రుహీనుఁడుగ నుండి రాజయోగము ననుభవించును

శ్లో॥ చరరాశిషు కేంద్రస్థైః శత్రుభిస్స్వోచ్చగైః క్రమాత్। భవేజ్జాతష్షడధిక పంచాశద్దేశనాయకః॥



తా॥ చరరాసుల కేంద్రములుగనుండి వానిలో నాలుగు గ్రహములు క్రమముగ నుచ్చస్థానము నందుండిన యాజాతకుఁడు ౫-౬ దేశములకు చక్రవర్తియగును

శ్లో॥ మందేశో త్తమవర్గగేబలియుతే నీచాంశ వర్గేగురౌ। భానౌశోభనదృష్టిభాగసహితే వాజప్రియ స్తత్సమః ॥ రాహుఃకర్మణిలాభగే రవిసుతేభాగ్యాధిపేనేక్షితే । లగ్నేచయదినీచ ఖేచరయుతే పృథ్వీశతుల్యోభవేత్ ॥

తా॥ శని తనయుత్తమవర్గమును బొందినవాఁడై బలవంతుఁడుగ నుండినను నీచాంశవర్గమున గురుఁడుండినను సూర్యునికి శుభగ్రహవీక్షణము గల్గియుండినను జాతకుఁడు రాజుకు ప్రియుఁడుగా రాజుతో సమానుఁడుగనుండును రాహువు౧౦యింట శని ౧౧ యింట నుండి భాగ్యాధిపతిచేచూడఁబడనేని లగ్నాధిపతి నీచగ్రహములతో చేరియుండనేని యాజాతకుఁడు రాజుతో తుల్యుఁడగును

శ్లో॥ లాభేశధర్మేశ ధనేశ్వరాణాం ఏకోపిచంద్రగవా కేంద్రవర్తీ।స్వపుత్రలాభాధిపతిర్గురుశ్చే దఖండ సామ్రాజ్యమహీపతిస్స్యాత్ ॥

తా॥ లాభాధిపతి ధర్మాధిపతి ధనాధిపతి వీరి

లోనొకరైనను చంద్రరాశికి కేంద్రమున నుండి పుత్రస్థానము లాభస్థానము వీటికి గురువధిపతిగ నుండిన అఖండ సామ్రాజ్యమగు రాజ్యమనుభవించును.

శ్లో॥ ధనుర్మీన తులాకుంభ మకరోదయ గేశనా।
శౌర్యాంగనపతిర్విద్వాన్ పురగ్రామాణిర్భవేత్ ॥

తా॥ ధనస్సు, మీనము, తులా, కుంభము, మకరము యీరాసులలో శనియుండినఅజాతకుఁడు మహా శూరుఁడుగను రాజుగను లేక విద్వాంసుడుగను లేక పురగ్రామములకధిపతిగానైననునుండును

శ్లో॥ నీచస్థితో జన్మనియోగ్రహశ్చ తద్రాశినా
థోపి తదుచ్ఛనాథః। సచంద్రలగ్నా ద్యదికేంద్ర
వర్తి రాజాభవేద్ధార్మికచక్రవర్తి॥

తా॥ కన్మకాలమునందు యేగ్రహము నీచస్థానమందున్నప్పటికిన్ని అరాశ్యాధిపతి ఉచ్ఛస్థానుఁడై అతఁడు చంద్రలగ్నమునకు కేంద్రమందుడైనా ధర్మబుద్ధిన్ని భూమండలమేలు రాజగును.

—భాస్కరయోగము—

శ్లో॥ భానోర్ధగతో బుధశ్శని సుతా ల్లాభస్థి
తశ్చంద్రమాః। చంద్రాత్ కోణగతః పురంధర
గురు ర్యోగ స్తథా భాస్కరః॥ శూరో భాస్కరయో



గజః ప్రభుసమ శ్శాస్త్రర్ధ విద్రూపవాన్ । గంధ
ర్వాగమవిత్సువాగ్గణితవి ద్ధీరస్సమర్థో భవేత్ ॥

తా॥ సూర్యుఁడుండు రాశికి రెండవరాశిలో బుధుఁడుండినను ఆబుధునికి లాభమునందు చంద్రుడును చంద్రునికి త్రికోణమునందు గురువును వుండిరేని అది భాస్కరయోగమనఁబడును. దానిలో బుట్టినవాఁడుమిక్కిలి శూరప్రభువుతో సమానుఁడుగ శాస్త్రము తెలిసినవాఁడుగ – రూపవంతుఁడుగ– భరతశాస్త్రము– సంగీతశాస్త్రము – కవితగణితము యివి తెలిసివాఁడుగ మిక్కిలి ధైర్యవంతుఁడుగ సమర్థుఁడుగ నుండును.

—చంద్రయోగము—

శ్లో॥ చంద్రాద్వ్యక్రమగః కుజోపనిసుతా దంత్యే
శనిస్సూర్యజా। దస్తైదైత్యగురుస్సితాన్మదనగో జీవో
యదీంద్వా హ్వయః। ఖ్యాత స్త్వింద్రధన స్సుశీల
గుణవాన్ భూపోధవాతత్సమః। వాగ్మివి త్తవిచిత్ర
భూషణయుతో రూపప్రతాపాన్వితః॥

తా॥ చంద్రుఁడుండు రాశికి మూఁడవ రాశియందు అంగారకుఁడు వానికి ౧౨ వ రాశిలో శని వానికి ౭ వ రాశిలో శుక్రుఁడు వానికి ౭ వ స్థానమందు గురువు– యిట్లుండి రేని చంద్రయోగ

మనఁబడును. ఈ యోగమునందు బుట్టినవాఁవాడు మంచి యాచారము గలవాఁడై రాజుగను, లేక రాజుతో తుల్యుఁడుగను అమృతవాక్కు గలవాడు గను ధనము—విచిత్రభూషణములు—మంచిరూపము ప్రతాపము వీనితో గూడినవాఁడుగ నుండును

—మరుత్తు యోగము—

శ్లో॥ శుక్రాత్కోణగతౌ గురుస్సురగురోః పుత్రేశశీతగోః॥ కేంద్రస్థానసమాశ్రితో దినకరో యోగో మరుత్సంజ్ఞకః॥ వాగ్మీవాద్యుషనో విశాలహృదయ స్థూలాకృతిశ్శాస్త్రవిత్ । సంపన్నక్రయవిక్రయేషు చనురో రాజాథవా తత్సమః ॥

తా॥ శుక్రునికి కోణమునందు గురువును వానికి 5 యింట చంద్రుఁడును వానికి కేంద్రమందు సూర్యుఁడును వుండిరేని మరుత్తు అనే యోగము. దీని యందు పుట్టినవాఁడు అమృతవాక్కు గలవాడు గను విశాలవక్షస్థలము— స్థూలమగు శరీరముగల వాఁడుగను—శాస్త్రము తెలిసినవాఁడుగను— ధన సంపన్నుఁడుగను —క్రయవిక్రయములయందు చతురుండుగను రాజుగను, లేక రాజుతో తుల్యుఁడు గను నగును.



—బాలారిష్టము—

శ్లో॥ భౌమాంశకస్థితేమందే భౌమేనైవనిరీక్షితే రాహుదృష్టియుతేవాపి వర్షమేకం సజీవతి। శుక్రాంశకస్థితేమందే శుక్రేనైవనిరీక్షితే। కేతుదృష్టియుతే వాపి త్రివర్షం తస్యజీవితం। సౌమ్యాంశకస్థితేమందే సౌమ్యేనైవ నిరీక్షితే। సూర్యదృష్టియుతేవాపి త్రివర్షం తస్యజీవితం। అర్కాంశకస్థితేమందే అర్కేనైవనిరీక్షితే। కార్యదృష్టియుతేవాపి చాతుర్వర్షం జీవతి। చంద్రాంశకస్థితేమందే చంద్రేనైవనిరీక్షితే దేహాధిపేనసందృష్టే షడ్వర్షంతస్యజీవితం। అథవా చాష్టమేవర్షే నజీవతాననంశయః । జీవాంశకస్థితే। మందే జీవేనైవనిరీక్షితే। చంద్రదృష్టియుతేవాపి చాతుర్వర్షం నజీవతి ॥

తా॥ జననజాలమునందు శని అంగారకాంశంబు నందుండి అంగారకునిచే జూడఁబడినను లేక రాహువుచే చూడఁబడినను నాశిశువుగ సంవత్సరం జీవించి యుండును మఱియు శని శుక్రాంశంబునఁదుండి శుక్రునిచే జూడఁబడినను లేక కేతువుచే జూడఁబడినను 3 సంవత్సరంబులవఱకు జీవించియుండును మఱియు శని బుధాంశంబునందుండి బుధునిచేజూడబడినను లేక సూర్యునిచే జూడఁబడినను 3 సంవత్సర

ములవరకు జీవించియుండును. మఱియు శని సూర్యాంశమునందుండి సూర్యునిచే జూడంబడినను లేక శుక్రునిచే జూడబడినను ౮ సంవత్సరములుజీవించియుండును, మఱియు శని చంద్రాంశమునందుండి చంద్రునిచే జూడంబడినను లేక దేహాధిపతి చేజూడంబడినను ౭ సంవత్సరములు జీవించియుండును లేక ౬ సంవత్సరములకు మృతినొందును మఱియు శని గురువుయొక్క అంశమునందుండి గురువుచేజూడంబడినను లేక చంద్రునిచేజూడంబడినను ౮ సంవత్సరములవరకు జీవించియుండును

శ్లో॥ చతుష్టయ గతో రాహుః పాపైర్యదినిరీక్ష్యతే । జాతస్యమరణంద ద్వ్యాదశాబ్దేషో శేధవా॥

తా॥ ౮ వస్థానమందు రాహువుండి వానిని పాపగ్రహములు చూచిరేన ఆ జాతకునికి ౧౦ లేక ౧౬ వ సంవత్సరమందు మరణముగల్గును.

శ్లో॥ ద్వ్యాదశే రవిమందౌచ క్షీణచంద్రస్తుసప్తమే। పితుర్మరణదస్సద్యః శుభదృష్ణాత్ర్యయబ్దకే

తా॥ ద్వాదశమందు రవి-శని సప్తమందుక్షీణ చంద్రుడు నుండిరేని తండ్రికి అరిష్టము కలుగజేయును శుభగ్రహములు చూచిరేని ౩ సంవత్సరములపైన అరిష్టముకలుగును



శ్లో॥ ఆదిత్యచంద్ర మందాశ్చ పంచసప్తవ్యయేస్థితాః। పితరం మాతరం హన్యు శ్శిశుంచాపినసంశయః ॥

తా॥ జననకాలమందు సూర్యుడు చంద్రుడు శని ౭-౫-౧౨ యీస్థానములలో యుండిరేనితల్లిదండ్రికి శిశువునకు గండముకలుగును

శ్లో॥ రంధ్రస్థానేస్థితాస్సర్వే గ్రహాః ప్రాణహారాశ్శిశోః । తస్మిన్‌స్థితో ధరాసూనుః మాతులస్య మృతిప్రదః ॥

తా॥ జననకాలమునకు ౮ వ యింట సూర్యాది యేగ్రహములున్నను శిశువుకు అరిష్టము అంగారకుడుండెనేని మేనమామకు అరిష్టముకల్గును.

శ్లో॥ ఉదయే భూమిపుత్రస్తు సప్తమే సహితౌ శిశోః । సూర్యసౌరీ యది స్యాతాం సద్యోమరణ సూచకా ॥

తా॥ జన్మలగ్నమునందు కుజుడు ౭ వ యింట సూర్యశనులు జేరియుండెరేని పుట్టినశిశువు అప్పుడే మరణము నొందును.

శ్లో॥ విషమాంశగతేచంద్రే జాతో యమపురీం వ్రజేత్॥

తా॥ చంద్రుఁడు విషమరాశినిబొందినను శిశువుకు మరణముకలుగును.

శ్లో॥ లగ్నాదష్టమగ శ్చంద్రోలగ్న చంద్రాష్టమంతథా। క్రూరగ్రహానిరీక్షంతే జాతస్యమరణంధ్రువమ్॥

తా॥ లగ్నపేక్షయా అష్టమమందు చంద్రుడుండినను లగ్నాధిపతికి అష్టమమందు చంద్రుఁడుండినను వీటిని పాపగ్రహములు చూచినను శిశువునకు మరణము కలుగును.

శ్లో॥ ఉదయాస్తగతాః పాపాఃసద్యోమరణసూచికాః।షడష్టమేవిదుః పాపాఃకర్మస్థామరణంప్రదాః

తా॥ లగ్నము, ౭ వ స్థానము వీటియందు పాపగ్రహములు ౬-౮ యందు చంద్రుఁడుయిటుల వుండిరేని తత్క్షణమే శిశువు మృతినొందును ౧౦వ స్థానమందు పాప గహములు ఉండిరేని శిశువునకు అరిష్టముకలుగును

శ్లో॥ పాపాస్త్రికోణ కేంద్రస్థాః శుక్రః షష్ఠవ్యయాష్టగః। ఆదిత్యోదయవేళాయాం జాతోయమపురీంవ్రజేత్॥

తా॥ పాపగ్రహములు కేంద్రత్రికోణములయందును శుక్రుడు ౬-౮-౧౨ యీస్థానములయందును



వుండగా సూర్యోదయకాలమందు జనించిన శిశువు మరణమునొందును.

శ్లో॥ లగ్నపేవాఽంశపేవాపి జన్మకాలేస్తగాయది। తదాజాతస్యపుత్రస్య మరణాన్నాస్నసంశయః॥

తా॥ జన్మలగ్నాధిపతి అంశాధిపతి అస్తంగతులై యుండగా జనించినశిశువు మరణము నొందును.

శ్లో॥ లగ్నేచంద్రో వ్యయేభానుః నవమస్థోశనిర్యదా। అష్టమేభూమిపుత్రస్తు సద్యోమరణమాదిశేత్॥ లగ్నేవా పంచమేవాపి సప్తమేచాష్టమేయది। భానుభౌమాచతిష్ఠేతాం పితుర్మరణమాదిశేత్।

తా॥ లగ్నమునందు చంద్రుఁడు ౧౨వ యింట సూర్యుఁడు ౯ వ యింట శని, ౮ వ యింట అంగారకుఁడు వుండగా జనించిన శిశువునకు తండ్రికిని తత్క్షణమే మరణంకలుగును మఱియు లగ్నమందుగాని పైస్థానములయందుగాని రవికుజులు సంచరించెనచో అప్పుడు జన్మించినశిశువు తండ్రికి మరణముకలుగ జేయును.

శ్లో॥ కేతుం చతుష్టయే పుత్రం నవమం పితరం

తథా । అన్యదా గ్రహాశ్చ తద్వంశ్యాః పాపదృష్టాదిన త్రయే ॥

తా॥ కేతువు రాహువుగ వస్థానములోనుండి పాపుల వల్ల చూడంబడెనేని లేక ౫-౯ యీస్థానములను పాపులు చూచిరేని యపుడు జనించిన తండ్రికి అరిష్టము పై స్థానములయందు రాహువుండి పాపగ్రహములచే చూడఁబడెనేని పితృవంశజులకు మూఁడు దినములలో అరిష్టము కలుగును.

వచనము:— ౭ వ స్థానమందు కుజుఁడుండి వానిని శని నీచరాశి యందు వక్రించి చూచెనేని తండ్రి విదేశగతుఁడై తక్షణమే మరణమును బొందును మఱియు శని వక్రించి నీచరాశి యందుండఁగాగా ౭ వస్థానమున అంగారకుని చూచె నేని శనికి వక్రము నివర్తించినతోడనే పితృకు అరిష్టము కలుగును.

౨. లగ్నమునందు క్రూరగ్రహములుండి శుభగ్రహసంబంధము వీక్షణము లేకుండగా శనిచూచినను కేంద్రమునందు బృహస్పతి లేకుండినను తండ్రికిఅరిష్టము.

౩: రవి-కుజ-శనులు ౮ వస్థానమునుబొందిశుభగ్రహములచే జూడఁబడకుండిన తండ్రికిఅరిష్టము



౪ రవి-చంద్రుడు-శని ౫-౬-౧౨ యీస్థానములలో ప్రత్యేకముగాగాని లేక చేరిగాని యుండునపుడు పురుషుఁడు జనించిన తండ్రికి స్త్రీజనించిన తల్లికి అరిష్టము.

౫. జన్మలగ్నమందు రవి-చంద్రుడు సప్తమందు కుజుఁడుండి పై స్థానములను పాపగ్రహములుచూచిన కేంద్రత్రికోణములయందు శుభగ్రహములు లేకుండిన శిశువుయొక్క తల్లి యేడుదినములకు మృతినొందును

౬.: లగ్నమందు దశమమందు రవి-చంద్ర-శనులు గూడియుండి గురుదృష్టి లేకుండిన మాతాపితృ శిశువులకు అరిష్టము కలుగును

౭. చంద్రుఁడువుండే లగ్నమునకు పంచమస్థానమునందు కుజుఁడుండి గురుదృష్టి లేకుండిన మేనమామకు అరిష్టము కలుగును

౮. పంచమమునందు సూర్యుఁడుండెనేని తండ్రికి చంద్రుఁడుండెనేని తల్లికి కుజుఁడుండెనేని తోబుట్టువులకు బుధుఁడుండెనేని మేనమామకు గురువుండెనేని తల్లియొక్క తల్లికి శుక్రుఁడుండెనేని తల్లియొక్క తండ్రికి శనియుండెనేని శిశువుకు అరిష్టము కలుగును

## గ్రహాధిక వీక్షణ

ప్రతిగ్రహమును తానున్న రాశికి ఏడవరాశిపూర్ణదృష్టితో జూచుచుండును సప్తమదృష్టితో జూచునపుడు సామాన్యదృష్టియుందురు కుజగురుశనులు వీరధికముగా మఱికొన్నిరాసులను జూచెదరు వీనినే విశేషదృష్టి యందురు గురుండు తానున్న రాశికి ౫-౯ రాసులను శని తానున్న రాశికి 3-౧౦ రాసులను కుజుండు తానున్న రాశికి ౪-౮ రాసులపయిన నధికవీక్షణముకలిగియుండును

## గ్రహమిత్రత్వ శత్రుత్వములు

నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలికమిత్రుడయినఅధికమిత్రుండగును నైసర్గికశత్రుగ్రహము తాత్కాలిక శత్రువయిన అధికశత్రువగును నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక శత్రువయినను నైసర్గిక శత్రువు తాత్కాలిక మిత్రుడయినను సమానములగుదురు సమగ్రహదశలో శుభశుభములు సమముగానుండును.

## —రాశిస్వభావములు—

| చరరాసులు | స్థిరరాసులు | ద్విస్వభావరాసులు |
|---|---|---|
| మేషం | వృషభం | మిధునం |
| కర్కాటకం | సింహం | కన్య |
| తుల | వృశ్చికం | ధనస్సు |
| మకరం | కుంభం | మీనం |



## —రాశిప్రమాణములు—

మేషం మీనం ౪ గడియలు

వృషభం కుంభం ౪ గ 30 విగడియలు

మిధునం మకరం ౫ గ ౧౫ విగడియలు

కన్య తుల ౫ గ ౧౫ విగడియలు

సింహం వృశ్చికం ౫ గ 30 విగడియలు

కర్కాటకం ధనస్సు ౫ గ 30 విగడియలు

ద్వాదశరాసులకు ౬౦ గడియలు నియమము ఈ గడియలు ఒకదినములో గతించును అనఁగా దినప్రమాణము ౬౦ గడియ లన్నమాట ఒక్క గడియ ౬౦ విగడియలక్రింద విభజింపఁబడెను దినమునకు ౬౦ × ౬౦=3౬00 విగడియలు మఱియు దినమునకు ౨౪ గంటలు గంటకు ౬౦ నిమిషములు నిమిషమునకు ౬౦ సెకండ్లు చొప్పునచూడవలెనుదీనిప్రకారముగంటకు 2 1/2విగడియలయినవి ఒక నిమిషమునకు 2 [2విగడియలయినవి జననకాలము నీ విధముగా గడియలోనికి మార్చుకొనవలెను

## గ్రంథం సమాప్తము